# జమీన్ రైతు

Regd. No. H. NL. 10
సంపుటి: 58 సంచిక: 30
స్థాపితం: 1930
24-7-1987
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# పార్టీలు పోయి కులాలు పైకి వస్తున్నాయి!

మాజీ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి పి సి సి అధ్యక్షుడు కాగలరన్న వార్త రాష్ట్ర కాంగ్రెసువర్గాలలో తీవ్రంగా వినవస్తున్నది. 80వ పడిలో పడిన శ్రీ బ్రహ్మానందరెడ్డి ఇప్పటికి రాష్ట్ర రాజకీయాలలో చురుకుగానే

పాల్గొంటున్నారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు కాకుండా అడ్డుకడపలసిందని కొందరు ప్రముఖ కాంగ్రెసు నాయకులు మొన్నటివారంలో కేంద్రపరిశ్రమల మంత్రి, ప్రస్తుత పిసిసి

ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ తర్కస్థులు ఉన్నారు.

శ్రీ వెంగళరావు దీనిని తీవ్రమైన విషయంగా పట్టించుకోలేదని, తనను సంప్రదించకుండా కొత్తగా పి. సి. సి అధ్యక్షుని నియామకం జరగదని ఆయన వారికి హామీ ఇచ్చారుట. అయితే పి. సి. సి.లో త్వరలోనే మార్పులు సంభవమని శ్రీ వెంగళరావు అంగీకరించారు. దేశవ్యాప్తంగా కాంగ్రెసు జౌళన కార్యక్రమంలో భాగంగా ప్రతిపక్షాలు అధి

రెడ్డి- కమ్మ కులాలమధ్య, రాష్ట్రంలో రెండు అగ్రవర్గాల మధ్య ఘర్షణగా రూపుదిద్దుకునే పరిస్థితిని తెచ్చిపెడుతున్నది.

రాజకీయాలు తెరపైన, కులాలు తెర వెనుక వుండి కథనడిపే పాత పద్ధతికి భిన్నంగా ఇప్పుడు కులాలు తెరపైకి, రాజకీయాలు తెరమరుగుకు వెళ్లిపోయే కొత్త పరిస్థితులు తల యెత్తుతున్నాయి. సిద్ధాంతాలు, ఆర్థిక విధానాలకోసమేర్పడిన రాజకీయాలకు అలవాటుపడినవారికి ఈ

జామోనన్న ఆందోళనకూడా వ్యక్తం అవుతున్నది.

పల్నాడు ప్రాంతంలో కమ్మ-రెడ్డి కులాల మధ్య నెలకొన్న ఉద్రిక్త పరి

**మా హైదరాబాదు విలేఖరి**

స్థితులు, శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రకటనలకుతోడు నరసరావుపేట శాసనసభ్యుడు శ్రీ కోడెల శివప్రసాదరావును

తీసుకోవడంలోని ఔదార్యాన్ని ప్రశ్నించడం ఒక రకంగా, శ్రీ శివప్రసాద్‌కు హోం మంత్రిత్వశాఖ ఇవ్వడం మరో రకం. శ్రీ శివప్రసాద్‌పైనే కాంగ్రెసు నాయ

కుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి, జనతాపార్టీ నాయకుడు శ్రీ పి బాబుల్‌రెడ్డి తీవ్రంగా విమర్శనాస్త్రాలు గుప్పించడం

# బ్రహ్మానంద రెడ్డికి పి సి సి అధ్యక్షత?

కారంలోవున్న రాష్ట్రాలలో ప్రదేశ కాంగ్రెసు కమిటీల పునర్వ్యవస్థీకరణ చేపట్టాలని ప్రధాని, కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ రాజీవ్‌గాంధీ ఆశిస్తున్నట్లు శ్రీ జలగం తన అనుయాయులకు చెప్పారు.

కేంద్రంలో త్వరలో జరిగే మార్పులలో వెంగళరావుకు ఇప్పటికం ప్రధానమైన శాఖ ఇవ్వనున్నట్లు చెప్తున్నారు. ఆయనకు హోం మంత్రిత్వ శాఖ ఇచ్చినా ఆశ్చర్యంలేదని, అప్పుడు రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభుత్వాన్ని ఆయన కట్టి పడ్లార్పగలరని వారు

కొత్తపరిణామం అత్యంత ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఇటువంటి అవాంఛనీయ పరిణామాలు రాష్ట్ర రాజకీయాలను, శాంతిభద్రతలను ఎటువంటి మలుపు తిప్పు

హోంమంత్రిని చేయడం అగ్నికి ఆజ్యం పోసినట్టయింది. క్రిమినల్ కేసులువున్న శ్రీ శివప్రసాద్, శ్రీ సి. శివారెడ్డి శ్రీ జె. ఆర్. పుష్పరాజ్‌లను మంత్రివర్గంలోకి

గమనార్హం.

ఇక మున్నెన్నడూ లేని విధంగా రాష్ట్ర శాసనసభ సమావేశాలలో ఈసారి

—కొరవ 12 వ పేజీలో

# వెంగళరావుకు ప్రధానమైన శాఖ?

అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు హైదరాబాదు వచ్చినప్పుడు వేరుకున్నారు. ఈ విధంగా శ్రీ వెంగళరావు

ధీమాగా వున్నారు. రాష్ట్రంలో కొందరు ఐ. ఏ. ఎస్; ఐ. పి. ఎస్. అధికారులు తెలుగుదేశం ప్రభుత్వానికి తాబేదారులుగా తయారయ్యారని ఆయన ఆగ్రహంగా వున్నారు. హోంమంత్రి అయితే వీరంతా నేరుగా ఆయన ఆధీనంలోకి వస్తారు. శ్రీ వెంగళరావుకు కనుక హోంశాఖ లభిస్తే పరిస్థితులు ఇప్పటివలె వుండవు.

ఇప్పటికే పరిస్థితులు రోజురోజుకు క్షీణిస్తున్నాయి. రాష్ట్రంలో రెండు అగ్రకులాలమధ్య ఘర్షణలు చెలరేగే ప్రమాదం కనిపిస్తున్నది గుంటూరు జిల్లా దేచవరం గ్రామంలో కమ్మ, రెడ్లమధ్య జరిగిన ఘర్షణ, అందులో రెడ్లు తీవ్రంగా నష్టపడడం ఆ ప్రాంతానికి చెందిన మాజీ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి తీవ్ర ఆగ్రహం కలిగించింది. ఆయన దీనిని తీవ్రంగా తీసుకుని బాహాటంగా బహిరంగ సభలోనే శ్రీ రామారావు ప్రభుత్వాన్ని కమ్మకులానికి మేలుచేసే ప్రభుత్వంగా దుయ్యబడుతున్నారు. పదిరికుప్పం, కారంచేడు నీరుకొండ గ్రామాలలో జరిగిన ఘటనలు హరిజనులపై దాడులు కాబట్టి బలహీనవర్గాలపై అగ్రవర్ణాల దాడిగా అందరూ ఖండించడం జరిగింది. అయితే దేచవరం గ్రామంలో జరిగిన సంఘటన ఇద్దరు

వేదికనున్నవారిలో మాజీ పి సి సి అధ్యక్షుడు శ్రీ కె వెంకటస్వామి మాజీ

## నెల్లూరు ముచ్చట్లు

(6 వ పేజీ తరువాయి)

[illegible] గ్రామ [illegible] వేధిస్తుంది [illegible] యిప్పించారు.

అయితే పార్టీమంచి తలపెట్టిన ఈ తెలుగు నాయకులను రక్షించడానికి ఎస్.పి. గారే స్వయంగా రంగంలోకి దిగారని, నిందితులను అరెస్టు చేయకుండా అడ్డుకుంటారని, వారందరూ ఇప్పుడు ఎస్.పి. రక్షణలో హాయిగా తిరుగుతున్నారని వదంతిగా వుంది.

ఎస్. పి. గారూ ఇది నిజమా?

### ఇరకం దీవుల్లో రాజకీయ అగ్ని

కరకు నదిపాయ పులికాట్ సరస్సు మధ్య ఇరకం దీవుల్లో తెలుగు నాయకులు రాజకీయాగ్నిని రగిలించారు. మొన్నటిదాకా, పొరపొచ్చాలు లేకుండా అన్నదమ్ముల్లా [illegible] ప్రేరణ కల్పించారు. ఈ రాజకీయ హోమంలో బొద్దులూరు శెట్టి అనే శాంతి హతమైపోయాడు కూడా!

చింతకాయల చాట్లు, మూఢ నమ్మకాలు, అవిద్య, అజ్ఞానం, అనాగరికత, దుర్భర దారిద్ర్యం, రోగాలు రొష్టులతో నరక నికృష్టమైన జీవితం గడిపే ఈ దీవ్యా గ్రామాల సహకార ఎన్నికల్లో కాంగ్రెస్‌కు టిక్కు పెట్టారని కక్ష పెట్టుకొని, సూళ్లూరుపేట దేశం నాయకులు పోలీసుల అండతో ఈ దీవులలో చిచ్చుపెట్టారట. అది రాజుకొని రాజుకొని పెద్దదై హత్యలవరకు పోయింది.

పోలీసు అధికారులైనా ఈ గ్రామాలకు శాంతి ప్రసాదించకూడదా!

---

## ఉత్తర క్రియలు



నా సోదరుడు

**కేతిరెడ్డి మధుసూదనరెడ్డి B. E.,**

(E. C. I. L., HYDERABAD.)

*18-7-87* తేది శనివారం పరమపదించారు.

ఆయన ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**ఉత్తర క్రియలు**

*29-7-87* తేది బుధవారం తార్నాక, సికింద్రాబాదులోని మా స్వగృహమున జరుగును.

కాన తెలియజేయడమైనది.

**కేతిరెడ్డి రాధాకృష్ణారెడ్డి,**

పార్టనర్: హోటల్ అజంత, స్వాతి రెస్టారెంట్, నెల్లూరు.

సోదరీమణులు:

కారెంపూడి కామేశ్వరమ్మ, డా. జి. సుదర్శన M.D.,

డాక్టరు వేణుగోపాలరెడ్డి M.B., B.S.,

జి. సూర్యనారాయణరెడ్డి, B.E., M.B.A.

బావగార్లు.

---



---



---

## శుభాకాంక్షలు





నెల్లూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకుఛైర్మెన్‌గా

**శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డిగారు**

బ్యాంకు డైరెక్టరుగా

**శ్రీ నల్లపరెడ్డి జగన్ మోహన్ రెడ్డిగారు**

ఏకగ్రీవంగా ఎన్నికైన సందర్భంలో వారికి మా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపుతూ వారిని ఎంపికజేసిన ప్రియతమ ముఖ్యమంత్రి

**శ్రీ నందమూరి తారకరామారావు గారికి**

తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శి

**శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు గారికి**

వీరి విజయానికి కృషి చేసిన రెవెన్యూమంత్రి శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి గారికి జిల్లాపరిషత్ ఛైర్మెన్ శ్రీ డేగా నారసింహారెడ్డిగారికి, జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షులు శ్రీ యల్లసిరి శ్రీనివాసులురెడ్డిగారికి, శాసనసభ్యులకు తెలుగుదేశం కార్యకర్తలకు మా అభినందనలు.

ఇట్లు,

అల్లంపాటి పెద్దవెంకటసుబ్బయ్య,
పసుపులేటి శంకరయ్య

పాలూరు బాలసుబ్రహ్మణ్యం
పై. మధుసూదనరావు
(వీడియోవిజన్-నెల్లూరు)



గుండ్లపల్లి శ్రీధర్‌రావు



పాలూరు రాధాకృష్ణయ్య
అధ్యక్షులు, నెల్లూరుజిల్లా విశ్వబ్రాహ్మణ సంఘం.

